


శ్రీ ఆస్ట్రో విజన్ వారి "మాస్టర్ క్లాసు" హైదరాబాదు
చాంద్రమానము: స్వస్తిశ్రీ విళంబి సంవత్సర భాద్రపద బహుళ చవితి, మంద వాసరం,
హూణ మానము: సెప్టెంబర్ 29, 2018



# జాతక విశ్లేషణ – వర్గ చక్రాలు


సమర్పణ :
"జ్యోతిష రత్న", "జ్యోతిష ఆచార్య", "జ్యోతిర్విద్యాభూషణ", "జ్యోతిష సాగర"

## జాలా సోమనాథ శాస్త్రి



M.Com., C.A.I.I.B., M.A. (Vedic Astrology – OU)
M.A. (Vedanga Jyothisha – Yoga Samskrutham University, Florida, USA)

**Cell:** 89 78 31 33 32 **eMail:** jssastry@gmail.com


ॐ



|| తస్మై శ్రీగురవే నమః || *Om Sree Gurubhyo Namah*

## శ్రీ మహా గణాధిపతయే నమః
## శ్రీ గురుభ్యో నమః

ఓం సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై

తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై

ఓం శాంతి శ్శాంతి శ్శాంతి:

శిష్యాచార్యులమగు మా ఇద్దరిని కూడా పరబ్రహ్మ విద్య రక్షించును గాక ! మా ఇద్దరికిని పరబ్రహ్మ విద్యా నిమిత్తమైన సామర్థ్యము కలుగును గాక! మాచే అధ్యయనము చేయబడినది మా ఇద్దరికిని తేజోవంతమగును గాక (అర్థజ్ఞాన యోగ్యమగుగాక) ! శిష్యాచార్యులమైన మేమిద్దరమును విరోధము పొందకుందుము గాక.! మా ఇద్దరికిని ఏదైనా ప్రమాదమువలన ద్వేషము కలిగెనేని అది లేకుండ పోవుగాక !

ఆదిత్య చంద్రా వనిజజ్ఞ జీవ, శుక్రార్క పుత్ర మపి రాహు కేతు,
ఏతే గ్రహాణామ్ సకలార్ధ సిద్ధిం కుర్వంతు కాలే స్థిర భోగ నిత్యః

శ్రీ మహా గణాధిపతయే నమః
శ్రీ గురుభ్యో నమః

శ్లో|| ఆదిత్యాది నవ గ్రహాశ్శుభ ఫలాః మేషాదయో రాశయః |
నక్షత్రాణి సయోగకాశ్చ తిథయ స్తద్దేవతా స్తద్గణాః ||
మాసాబ్దా ఋతయ స్తథైవ దివసాః సంధ్యాదయో రాత్రయః |
సర్వే స్థావర జంగమాఃప్రతిదినం కుర్యుః సదా మంగలమ్ ||

తా|| ఆదిత్యాది నవగ్రహములు, మేషాది రాశులు, వారి వారి అధి దేవతలు, గణములతో, నక్షత్రములు, యోగములు, తిథులు మరియు మాసములు, అబ్దములు (సంవత్సరములు), ఋతువులు, దివసములు (పగళ్ళు), సంధ్య-ఉదయములు, రాత్రులు (ఇవి అన్నియు కూడా) అన్ని స్థావర జంగమములకు ప్రతి దినము ఎల్లప్పుడూ మంగళములు కలిగించును గాక !

# జ్యోతిషం – ప్రత్యక్ష శాస్త్రం : మౌలికాంశాలు

ఈ సృష్టి లో మానవ మేధస్సుకు గోచరమయ్యేదీ పూర్తిగా అర్థం కానిదీ "విశ్వం" మాత్రమే – విశ్వము లో ఉన్నది జ్యోతిస్సులు – జ్యోతిస్సుల నడుమ సౌర కుటుంబము, అందులో భూగోళం, దాని మీద మానవుడు వున్నాడు

ప్రకృతి ని తనకు సదా అనుకూలముగా మలచుకొనుటకు మానవుడొక్కడే నిరంతరం ప్రకృతిని పరిశీలిస్తున్నాడు. జీవ పరిణామ క్రమం లో ఆదిమానవుడి స్థాయి నుండి ఎదుగుతున్న ప్రక్రియ లో, ఎందరో అపరిమిత జ్ఞాన సంపన్నులైన ఋషులు, ఈ భూమి పై ఏది జరుగుతున్నా అది జ్యోతిస్సుల ప్రభావ ఫలితమే అని దర్శించి, తమ పరిశోధనల లో తెల్సుకొని ముందు తరాల వారికి తమ పరిశోధనా జ్ఞాన ఫలములు అందించుటకై "భాష" ను సృష్టించి, వేదముల రూపములో జ్ఞాన నిధి ని అందించారు. అట్టి జ్ఞాన నిధి లో – నేటి ఎన్నో విజ్ఞాన మరియు సామాజిక శాస్త్రాలకు మాతృక అయిన జ్యోతిష శాస్త్రము – ఎంతో ముఖ్యమైనది.

జ్యోతిషం ప్రత్యక్ష శాస్త్రము. ఈ శాస్త్రము ద్వారా మనం దర్శించేది, పరిశీలించేది మనలను నిరంతరం ప్రభావితం చేసే మనకు కనపడుతున్న ప్రకృతియే.

ఈ శాస్త్ర ఫలితములు అనుభవించ వలె నన్న, ముందుగా మనము తెలుసుకోవలసినది మనము ఉంటున్న భూమి మరియు భూమి చుట్టూ వున్న జ్యోతిస్సుల గురించియే. వాటి వివరణ యే మనకు ఋషులు సిద్ధాంత స్కంధము లో అందించారు.

# విశ్వం – విభాగాలు




**Observable Universe → Local Superclusters → Virgo Supercluster → Local Galactic Group → Milky Way Galaxy → Solar Interstellar neighbourhood → Solar System → The Earth**

*Artist's Concept: Earth's Location in the Universe*

## పాలపుంతలో నక్షత్రాల నడుమ సౌర మండలం



## సౌర కుటుంబం



## : సౌర మండలము :
## భూమి నుండి బాహిర మరియు అంతర గ్రహాలు



గ్రహ రాజ్యము లో సూర్యుడికి, భూమి కి మధ్య పరిభ్రమించే గ్రహాలను (బుధ, శుక్ర) "అంతర గ్రహాలు" అని భూగోళ కక్ష్య కు అవతల పరిభ్రమించే గ్రహాలను (కుజ, గురు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో) "బాహిర గ్రహాలు" అని అంటారు.

**సౌర కుటుంబ స్వరూపం దర్శించిన తరువాత దాని చుట్టూ వున్న అంతరిక్ష భాగము – అదే నక్షత్ర మండలము – పరిశీలిద్దాం.**

**భూమి నుండి చూసినప్పుడు ఆకాశం లో మనకు సౌర మండలము తో పాటు కనిపించే మన చుట్టూ వున్న ఆ నక్షత్ర మండలము లోని నక్షత్రముల నుండియే భూ గోళము ను ప్రభావితం చేసే జ్యోతిస్సుల కాంతులు ప్రసారమవుతుంటాయి. ఇప్పుడు కొన్ని నక్షత్రముల స్వరూపం వాటి ముందు సూర్యుడిని పోల్చి దర్శిద్దాము....**

Antares is 15th brightest star in the sky

## It is more than 1000 light years away




## భ చక్రం:

**భూమి నుండి చూసినప్పుడు ఆకాశం లో మనకు కనిపించే మన చుట్టూ వున్న అంతరిక్ష భాగము – భూ గోళము ను ప్రభావితం చేసే జ్యోతిస్సుల కాంతులు ప్రసారమయ్యే వృత్త భాగము**



## భూమి చుట్టూ వున్న జ్యోతిస్సులు




## భూమి పై నుండి ఆకాశము లోనికి చూసినప్పుడు... గ్రహములు, నక్షత్రములు
## (భూ గోళము పైకి జ్యోతిస్సుల కాంతి ప్రసరించే మార్గము)



## జ్యోతిషం - మూల భావన - ప్రవర్తకులు

**భూ గోళం మీద ఏది జరిగినా (మానవ జీవితాలు సహా), జరుగుతున్నా, జరుగబోతున్నా - అది పూర్తిగా జ్యోతిస్సుల ప్రభావ ఫలితమే.**

ఈ మూల భావన ఆధారంగానే మన ప్రాచీన శాస్త్రజ్ఞులు – అనగా – ఋషులు, మానవ జీవితం సౌకర్యవంతము, సుఖమయము చేసుకొనుటకు గాను - జ్యోతిస్సుల ప్రభావమును గణించుటకు, అర్థం చేసుకొనుటకు మరియు సానుకూలము చేసుకొనుటకు తీవ్ర పరిశోధనలు చేసి తమకు కలిగిన అనుభవాలను పరీక్షించి, నిర్ధారించుకొని జ్యోతిష శాస్త్రమును మనకు "సిద్ధాంతములు", "హోరా శాస్త్రములు" "సంహితలు" రూపము లో అందించారు.

ఆ ప్రాచీన శాస్త్రజ్ఞులనే మనం జ్యోతిష శాస్త్ర ప్రవర్తకులు అని స్మరిస్తుంటాము.

సూర్యః పితామహో వ్యాసో వసిష్ఠోత్రి పరాశరః
కశ్యపో నారదో గర్గో మరీచిర్మనురంగిరాః
రోమశః పౌలిశశ్చైవ చ్యవనో యవనో భృగు:
శౌనకోష్టాదశాశ్చైతే జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకాః

## "జ్యోతిషం" - "జ్యోతిష్కులు"

నేటి కాలం లో "జ్యోతిషం" అనే పదం నానార్థాలతో ఉపయోగించబడుతున్నది

1."జ్యోతిషం" – జ్యోతిస్సులకు సంబంధించిన శాస్త్రం. ఇది పంచ స్కంధాత్మకం.

2."జ్యోతిషం" – జ్యోతిశ్శాస్త్రపు సూత్రాలను అన్వయించి మానవ జీవిత విషయములలో జ్యోతిస్సుల ప్రభావ ఫలితాలను సూచించడం – దీనినే "ఫలిత జ్యోతిషం" అంటారు. ఈ వృత్తి లో ఉన్నవారినే సాధారణంగా "జ్యోతిష్కులు" అంటారు.

3."జ్యోతిషం" – "భవిష్యత్తు చెప్పడం"

Astrology is not prediction – Prediction is one utility in Astrology

మనం జ్యోతిషాన్ని "శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞాన నిధి" గానే స్వీకరిద్దాము

**ఋషులు (ప్రాచీన శాస్త్రజ్ఞులు) మనకు రాశి చక్రం ఆధారంగా జ్యోతిస్సుల కారకత్వాలు మరియు వాటి స్థితి, యుతి, దృష్టి, సంబంధము మేళవించి భూమి పై, ముఖ్యముగా మానవ జీవితం మీద, వాటి ప్రభావం అత్యంత శాస్త్రీయముగా గణించి, ఫలిత సూచనలు గ్రహించడానికి సూత్రములు అందించారు**




## జాతక విశ్లేషణ కై ఋషులు అందించిన మౌలిక సాధనములు (Basic Tools)

1.రాశి చక్రము: ఇష్ట కాలమునకు జ్యోతిస్సుల యధాతధ స్థితి ని సూచించునది. ఇది మొట్ట మొదటి అత్యంత ప్రాధమిక సాధనం.

2. భావ చక్రము: జ్యోతిస్సుల కారకత్వములను అన్వయించుకొని వాటి ప్రభావమును గణించి, అర్ధం చేసుకొని, ఫలితములను సూచించుకొనుటకు, - భూమి తన చుట్టూ తాను తిరగడం ఆధారంగా – "ఘటనా కాలమునకు" నిర్మించుకునే రెండవ అత్యంత ప్రాధమిక సాధనం.

3. పై రెండు చక్రములలో గ్రహ స్థితి

4. జ్యోతిస్సుల కారకత్వములు

5. దశా విధానము

**ఈ అయిదు సాధనములూ లేకుండా, జ్యోతిష శాస్త్ర జ్ఞానమును ఉపయోగించుకోవడం ఏ మాత్రమూ సాధ్యం కాదు.**

# రాశి చక్రం – జ్యోతిస్సులు










*భూ కేంద్ర భావన*

కుండలి

# రాశి చక్రము లో విస్తరించి వుండే జ్యోతిస్సులు

## స్థిర జ్యోతిస్సులు (నక్షత్రాలు 27 – రాశులు 12) (విస్తార క్రమం లో)

**నక్షత్రాలు:**

అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ (పూర్వ ఫల్గుణి), ఉత్తర (ఉత్తర ఫల్గుణి), హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి

**రాశులు:** మేషం, వృషభం, మిధునం, కర్కాటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం

## చర జ్యోతిస్సులు (9 గ్రహాలు)

**రవి, చంద్ర** (బింబ గ్రహాలు – 2: సదా ఋజు) **కుజ, బుధ, గురు, శుక్ర, శని** (పంచ తారా గ్రహాలు: ఋజు/వక్ర) **రాహు, కేతు** (ఛాయా గ్రహాలు – 2: సదా వక్ర)

| | | | |
|---|---|---|---|
| మీనం | మేషం | వృషభం | మిధునం |
| కుంభం | Chart కుండలి | | కర్కాటకం |
| మకరం | | | సింహం |
| ధనుస్సు | వృశ్చికం | తుల | కన్య |

## కుండలి లో స్థిర జ్యోతిస్సులు




## కుండలి లో రాశులు, నక్షత్రములు, వాటి పాదములు

| | | | |
|---|---|---|---|
| పూర్వాభాద్ర – 1<br>ఉత్తరాభాద్ర – 4<br>రేవతి – 4 | అశ్విని – 4<br>భరణి – 4<br>కృత్తిక –1 | కృత్తిక – 3<br>రోహిణి – 4<br>మృగశిర – 2 | మృగశిర – 2<br>ఆర్ద్ర – 4<br>పునర్వసు – 3 |
| ధనిష్ట – 2<br>శతభిషం – 4<br>పూర్వాభాద్ర – 3 | *రాశి చక్రము* | | పునర్వసు – 1<br>పుష్యమి – 4<br>ఆశ్లేష – 4 |
| ఉత్తరాషాఢ – 3<br>శ్రవణం – 4<br>ధనిష్ట– 2 | | | మఖ – 4<br>పుబ్బ – 4<br>ఉత్తర ఫల్గుని –1 |
| మూల – 4<br>పూర్వాషాఢ – 4<br>ఉత్తరాషాఢ –1 | విశాఖ – 1<br>అనూరాధ – 4<br>జ్యేష్ఠ – 4 | చిత్త – 2<br>స్వాతి – 4<br>విశాఖ – 3 | ఉత్తర ఫల్గుని – 3<br>హస్త – 4<br>చిత్త – 2 |

## రాశి చక్రము లో మేష రాశి యే ఆరంభ రాశి – శాస్త్రీయత!

ప్రాచీన శాస్త్రజ్ఞులు ప్రకృతిని ఎంతో సూక్ష్మంగా పరిశీలించి, భూమి మీద జరిగే ప్రకృతి ప్రక్రియను, స్థిరంగా వుండే రాశి చక్రమును మరియు అందులో రవి సంచార స్థితి ని సమన్వయించి రాశుల గణన మేషాది గా నిర్ణయించినారు.

ఇందుకు ముఖ్య కారణాలు:

1.రవి మేషము లో సంచరించే కాలము లోనే చెట్లు చిగురిస్తాయి. దీనినే సృష్టి ఆరంభ కాలమని భావించారు.

2.రవి మేషము లో ప్రవేశించే నాడు పగలు రాత్రి సమానంగా వుంటాయి (వసంత విషువత్తు) (నిరయనము తో)

3.రాశి చక్రము లో మేషము, కర్కాటకము, తుల మరియు మకరము కేంద్రములు గా గ్రహించారు. ఈ రాసులలో రవి సంక్రమణం అవుతున్నపుడే భూమి మీద వాతావరణం లో కీలక మార్పులు జరగడం ఆరంభ మవుతుంది.

(1, 7 లో పగలు రాత్రి సమానము గా వుండటం, 4 లో అతి పొడవైన పగటి కాలము 10 లో అతి పొడవైన రాత్రి కాలము ముగియడం)



## భావ చక్రము లోని అంశాలు – పురుషార్థములు




భూభ్రమణమే మూలముగా ఘటనా కాల సమయం పై ఆధార పడి నిర్మించుకొన్నదే భావ చక్రం

## రాశి చక్రము (Zodiac Wheel) &
## భావ చక్రము (The Wheel of Houses)

| | | | |
|---|---|---|---|
| మీనం | మేషం | వృషభం | మిధునం |
| కుంభం | రాశి చక్రం<br>మేషాది గా గణన | | కర్కాటకం |
| మకరం | | | సింహం |
| ధనుస్సు | వృశ్చికం | తుల | కన్య |

| | | | |
|---|---|---|---|
| 4 | 5 | 6 | 7 |
| 3 | భావ చక్రం<br>లగ్నాది గా గణన<br>ఉదా: ధనుస్సు లగ్నం అయినప్పుడు | | 8 |
| 2 | | | 9 |
| 1 | 12 | 11 | 10 |

# జ్యోతిషం లో 'కుండలీ'లు

ప్రాచీన శాస్త్రజ్ఞులు అందించిన జ్యోతిష శాస్త్ర జ్ఞాన ఫలములు పొందుటకు, సార్వత్రికముగా కేవలం మూడు రకములైన కుండలీల లో కావలసిన ఒక దానిని మాత్రమే ఉపయోగిస్తారు.

అవి:

1. జనన కాల సమయమునకు వేసుకొని, జాతకుని మొత్తం జీవిత కాలానికి సంబంధించిన ద్వాదశ భావములకు ఫలితాలు తెలుసుకోవడానికి – జన్మ కుండలి = జాతకము
2. మనసులో ఉదయించిన ప్రశ్న / సందేహము ను జ్యోతిష్కుడికి నివేదించి ఏదో ఒక భావ సంబంధముగా ఫలితం తెలుసుకోవడానికి – ప్రశ్న కుండలి
3. జీవితములో ముఖ్య ఘటనలు జరగడానికి జ్యోతిస్సుల శుభ స్థితి సమయం ముందుగానే గణించి చేయ వలసిన పనిని ఆ సమయానికే చేయడం కొరకు – ముహూర్త కుండలి (ముహూర్తం)

పై మూడు రకముల కుండలీల నిర్మాణమునకు పాటించే సూత్రములు, అనుసరించే పద్ధతులు అన్నీ ఒక్కటే.

## భూ గోళం అణువణువునూ ప్రభావితం చేసే గ్రహ రాజ్య వ్యవస్థ (చర జ్యోతిస్సులు)

రాజు : రవి
రాణి: చంద్ర
సేనాధిపతి: కుజ
యువరాజు: బుధ
మంత్రులు:
గురువు & శుక్ర
సేవక: శని
ప్రత్యేక సేవక:
రాహు & కేతువు

రవి
బుధ
చంద్ర
శుక్ర
భూమి
కుజ
బృహస్పతి
శని
ప్లూటో
నెప్ట్యూన్
యురేనస్

## చర జ్యోతిస్సులు – గ్రహములు

రవి చంద్రులు – పగలు, రాత్రి



# జ్యోతిస్సుల కారకత్వములు

నక్షత్ర కారకత్వములు ... ... ...
రాశి కారకత్వములు ... ... ...
గ్రహ కారకత్వములు ... ... ...

## దశా విధానము

జాతక ఫలితములు జాతకులకు అందే కాలమును గుర్తించడానికి ఋషులు అందించిన ఐదవ ప్రాధమిక సాధనమే దశా విధానము. దాదాపు 50 విధానములు నిర్దేశించినా లోక బాహుళ్యము ఉపయోగించునవి కేవలం 3 మాత్రమే. అవి వింశోత్తరీ దశా విధానము, అష్టోత్తరీ దశా విధానము, యోగినీ దశా విధానము. వింశోత్తరీ దశా విధానము అత్యధికముగా ఉపయోగించ బడుచున్నది

# జాతక విశ్లేషణా సాధనముల ప్రయోజనము

- ❖ రాశి చక్రము, భావ చక్రము (జన్మ కుండలి)
- ➢ ఘటనా మూల కారకము (Source of Events)
- ❖ దశా విధానము
- ➢ ఘటనా కాల కారకము (Timing of Events)
- ❖ గోచారము (వర్తమాన గ్రహ స్థితి)
- ➢ జ్యోతిస్సుల ప్రభావ ఫలదీకరణ కాల కారకము (Fructification of Events)

# జాతక విశ్లేషణ – గ్రహముల ప్రాధాన్యత

**జాతక విశ్లేషణా సాధనములు**

1.రాశి చక్రము
2.భావ చక్రము
3.పై రెండు చక్రములలో గ్రహముల స్థితి
పై మూడు సాధనములను ఉపయోగిస్తూ యధోక్తముగా అన్నింటి కారకత్వాల మేళవింపు చేసి దశా కాలములను గమనిస్తూ ఫలిత సూచనలు పొందడమే జాతక విశ్లేషణా లక్ష్యము.

జాతక విశ్లేషణ లో గ్రహ స్థితి ప్రాధాన్యత

**రాశి మరియు భావ చక్రములలో స్థిర జ్యోతిస్సులు – నక్షత్రములు మరియు రాసులు. కనుక, స్థిర జ్యోతిస్సుల ప్రభావ పరిశీలనకై ఋషులు, చర జ్యోతిస్సులనే ఆధారంగా పరిగణించారు.**
అందు వలననే నక్షత్రముల ప్రభావమును తెలుసుకొనుటకు గ్రహములకు నక్షత్రాధిపత్యము, రాసుల ప్రభావమును తెలుసుకొనుటకు గ్రహములకు రాశ్యాధిపత్యము, భావములకు సంబంధించి గ్రహములకు సహజ భావ కారకత్వము నిర్ణయించినారు.

**ఈ కారణం గానే కుండలీ ల లో గ్రహ స్థితి కి అత్యంత ప్రాధాన్యత ఏర్పడినది.**



# గ్రహముల ధనాత్మక ఋణాత్మక ప్రభావము

మహా ఋషులు ఎంతో శాస్త్రీయం గా స్థిర జ్యోతిస్సులనుండి (నక్షత్రములు, రాశులు) చర జ్యోతిస్సుల (గ్రహముల) ద్వారా భూమి కి వచ్చు కాంతుల ప్రభావము అర్ధం చేసుకోవడానికి గ్రహములను రెండంచెలలో వర్గీకరించినారు.

1. గ్రహములను 8 గా గ్రహించి (రాహు/కేతువులను ఒకటి గా) 4 శుభులు (గురు, శుక్ర, బుధ, చంద్ర) 4 అశుభులు (పాపులు) (రవి, కుజ, శని, రాహు/కేతువు)
2. 2 శుభులు 2 అశుభులు ఒకటిగా రెండు వర్గములు (గురు వర్గము – గురు, చంద్ర, రవి, కుజ; శుక్ర వర్గము – శుక్ర, బుధ, శని, రా/కే) చేసి ఒకే వర్గము లోని వారు నైసర్గిక మిత్రులు గా ఇరు వర్గములు పరస్పరం నైసర్గిక శత్రువులు గా సూత్ర బద్ధం చేసినారు.

ఇందువలన నే "గ్రహ మైత్రి" మరియు "గ్రహ దృష్టి" జ్యోతిషం లో ఎంతో ముఖ్యమైన అంశములయినవి.

# జాతక విశ్లేషణ – మూలాధార విధానములు

జాతక విశ్లేషణ కై ఋషులు మనకు అందించిన విధానములు ప్రధానముగా రెండు రకములు:

1. కుండలీ సంబంధమైనవి
2. గ్రహముల సంబంధమైనవి

కుండలీ సంబంధ విధానములు: ద్వాదశ భావములు, వర్గ చక్రములు, వర్గోత్తమ స్థానములు, గ్రహములున్న రాశుల అక్షము.

గ్రహముల సంబంధ విధానములు: గ్రహములకు సహజ భావ కారకత్వములు (స్థిర, చర), సంబంధ త్రయము (స్థితి, యుతి, దృష్టి), గ్రహ మైత్రి, షడ్బలములు, వర్గ చక్రములలో బలములు. గ్రహముల బాల్యాది వివిధ అవస్థలు, అష్టక వర్గు విధానము, దశా విధానము, గోచారము

## జాతక విశ్లేషణ - గ్రహస్థిత రాశుల “అక్షము”

“Axis” of Planets in the Zodiac in Chart Analysis

గ్రహములు (చర జ్యోతిస్సులు) నిరంతరం రాశి చక్రములో సంచరిస్తుంటాయి. మన సౌలభ్యం కొరకు అవి ఏ నక్షత్ర పాదములో – ఏ రాశి లో (రాశి చక్రము నిర్మించిన సమయానికి) వున్నాయో ఆ భాగమును ఆయా “గ్రహ స్ఫుటము” అంటారు.

ఏ గ్రహమైనా ఏదో ఒక రాశి లో ఉండక తప్పదు. ఒక గ్రహము నుండి వేరొక గ్రహము మధ్యన ఇరు వైపులా వున్న రాసుల సంఖ్యను బట్టి ఆయా గ్రహములున్న “అక్షము” ఏర్పడుతుంది. (వృత్తములో పరస్పరం కాంతులు ప్రసరించుకునే దూరం). అందువల్లనే జాతక విశ్లేషణ లో రాశి చక్రములో గ్రహముల మధ్య వున్న అక్షము కూడా అత్యంత ప్రధానమైన అంశము గా మన ఋషులు గుర్తించారు.

గ్రహమున్న స్థానము నుండి ఇతర గ్రహములు వుండే రాశుల అక్షములు:

1. ఒకే రాశి లో వుంటే దానిని “యుతి” అంటారు. (అక్షము 1/1)
2. సమ సప్తకము (1/7)
3. ద్విర్ద్వాదశము (2/12)
4. తృతీయైకాదశము (3/11)
5. చతుర్ధదశమము (4/10)
6. నవ పంచకము (5/9)
7. షష్టాష్టకము (6/8)

ద్విర్ద్వాదశ, షష్టాష్టక (6/8) అక్షములు శుభదాయకము కాదు.

అక్షములేర్పడిన రాశుల అధిపతుల నైసర్గిక మైత్రి ని కూడా పరిగణించ వలసి వుంటుంది

## జాతక విశ్లేషణ - రాశుల “అక్షము”లు

| క్రమ సంఖ్య | రాశి | 2/12 అక్షము | 3/11 అక్షము | 4/10 అక్షము | 5/9 అక్షము | 6/8 అక్షము | 7/1 అక్షము |
|---|---|---|---|---|---|---|---|
| 1 | మేషం | వృషభం | మిధునం | కర్కాటకం | సింహం | కన్య | తుల |
| 2 | వృషభం | మిధునం | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం |
| 3 | మిధునం | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనుస్సు |
| 4 | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనుస్సు | మకరం |
| 5 | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనుస్సు | మకరం | కుంభం |
| 6 | కన్య | తుల | వృశ్చికం | ధనుస్సు | మకరం | కుంభం | మీనం |
| 7 | తుల | వృశ్చికం | ధనుస్సు | మకరం | కుంభం | మీనం | మేషం |
| 8 | వృశ్చికం | ధనుస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభం |
| 9 | ధనుస్సు | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభం | మిధునం |
| 10 | మకరం | కుంభం | మీనం | మేషం | వృషభం | మిధునం | కర్కాటకం |
| 11 | కుంభం | మీనం | మేషం | వృషభం | మిధునం | కర్కాటకం | సింహం |
| 12 | మీనం | మేషం | వృషభం | మిధునం | కర్కాటకం | సింహం | కన్య |

# ప్రముఖ జ్యోతిష పద్ధతులు – పరిగణించే అంశములు

**జ్యోతిస్సుల ప్రభావమును తెలుసుకొనుటకు ఏ జ్యోతిష పద్ధతి అవలంబించినా -**

పరిగణించే జ్యోతిస్సులు – 27 నక్షత్రాలు, 12 రాసులు, 9 గ్రహములు (పాశ్చాత్య 10) (తరచూ అప్రకాశక గ్రహములు కూడా పరిగణిస్తారు, ఉదా: మాంది/గుళిక)

ఉపయోగించే సాధనాలు – రాశి చక్రము, భావ చక్రము, రాశి భావములందు గ్రహ స్థితి, జ్యోతిస్సుల కారకత్వములు, దశా విధానము మరియు గోచారము

**పరాశర** | **తాజక** | **జైమిని** | **నాడీ (నక్షత్ర)** మీనా2 నాడీ | **పాశ్చాత్య**

**పరాశర, పాశ్చాత్య మరియు నాడీ జ్యోతిష పద్ధతుల మిశ్రమం – కేపీ పద్ధతి**

**జ్యోతిష పద్ధతులు - పరిశీలనాంశాల పట్టిక**

| | వివరములు | పరాశర | తాజక | జైమిని | నాడీ | పాశ్చాత్య |
|---|---|---|---|---|---|---|
| 1 | జ్యోతిస్సుల ప్రభావము గణించుటకు మూల సాధనం (Basic Tool), స్వరూపం | రాశి చక్రం, చతురస్రం | రాశి చక్రం, చతురస్రం | రాశి చక్రం, చతురస్రం | రాశి చక్రం, చతురస్రం | రాశి చక్రం, వృత్తము |
| 2 | స్థిర జ్యోతిస్సులు (నక్షత్రములు, రాశులు) | 27+12 | 27+12 | 27+12 | 27+12 | **12** |
| 3 | చర జ్యోతిస్సులు (గ్రహములు) | 9 | 9 + ముంథ | 9 | 9 | **10** |
| 4 | రాశి చక్ర సూక్ష్మ పరిశీలనకై ప్రధానంగా పరిగణించే మొత్తం అంశలు | **108** | **108** | **108** | **108** | **360** |
| 5 | జాతక పరిశీలనకై ప్రధానంగా పరిగణించే కారకులు | లగ్నరాశ్యాధిపతి, జన్మ రాశ్యాధిపతి, భావాధిపతి (3) | లగ్నరాశ్యాధిపతి, జన్మ రాశ్యాధిపతి, భావాధిపతి (3) | లగ్నరాశ్యాధిపతి, జన్మ రాశ్యాధిపతి, భావాధిపతి (3) | లగ్నరాశ్యాధిపతి, జన్మ రాశ్యాధిపతి, భావాధిపతి (3) వారి నక్షత్రాధిపతులు, (జీవ, శరీర గ్రహములు) | లగ్నరాశ్యాధిపతి, భావాధిపతి, భావ స్థిత గ్రహము/లు (3) |
| 6 | భావ బిందువు | భావ మధ్యమం | భావ మధ్యమం | భావ మధ్యమం | భావ మధ్యమం | భావాంతం |
| 7 | భావ కారకుల విశేషత | 7 స్థిర కారకులు | 7 స్థిర కారకులు | 7 చర కారకులు | 7 స్థిర కారకులు | 10 స్థిర కారకులు |
| 8 | భావ విశ్లేషణ లో పరిశీలించే భావములు | 12 + భావాత్భావం | 12 + భావాత్భావం | 12 + భావాత్భావం + కారకాంశ లగ్నం + ఆరూఢములు | 12 + భావాత్భావం | 12 + భావాత్భావం |
| 9 | జాతక సూక్ష్మ పరిశీలనకై ప్రధానంగా పరిగణించే ఇతర సాధనాలు | **16** వర్గ చక్రాలు, గ్రహముల షడ్బలములు, వివిధ అవస్థలు | **12 వర్గ చక్రాలు, గ్రహముల ద్వాదశ వర్గీయ బలములు, వర్షాధిపతి** | **16** వర్గ చక్రాలు, గ్రహముల షడ్బలములు | **16** వర్గ చక్రాలు, గ్రహముల షడ్బలములు | గ్రహ దృష్టులు, గ్రహముల బలములు |
| 10 | ఘటనా మూల కారకము (Source of Events) | జన్మ కుండలి, భావ చక్రము | జన్మ కుండలి, భావ చక్రము | జన్మ కుండలి, భావ చక్రము | జన్మ కుండలి, భావ చక్రము | జన్మ కుండలి, భావ చక్రము |

జ్యోతిష పద్ధతులు - పరిశీలనాంశాల పట్టిక

| | వివరములు | పరాశర | తాజక | జైమిని | నాడీ | పాశ్చాత్య |
|---|---|---|---|---|---|---|
| 11 | ఘటనా కాల కారకము (Timing of Events) | దశా కాలము | వర్ష ఫల చక్రం, ముద్ద దశా కాలము | దశా కాలము | దశా కాలము | పురోగామి చక్రము |
| 12 | జ్యోతిస్సుల ప్రభావ ఫలదీకరణ కాల కారకము (Fructification of Events) | గోచార చక్రము | గోచార చక్రము | గోచార చక్రము | గోచార చక్రము | గోచార చక్రము |
| 13 | ఫలిత సూచనలో ప్రధానంగా పరిగణించే అంశాలు | గ్రహముల సంబంధ త్రయం | లగ్నేశ, కార్యేశ సంబంధ యోగములు | రాశులందు గ్రహముల స్థితి, యుతి + రాశుల దృష్టులు | రాశులందు గ్రహముల, వారి నక్షత్రాధిపతుల స్థితి, యుతి, దృష్టులు | గ్రహముల దృష్టులు |
| 14 | పరస్పర సంబంధ నిర్ణయం లో దృష్టి వుండే జ్యోతిస్సులు | గ్రహములు | గ్రహములు | రాశులు | గ్రహములు | గ్రహములు |
| 15 | జ్యోతిస్సుల ప్రభావము గణించుటకు ఆరంభ బిందువు | జన్మ లగ్నము | అభీష్ట సంవత్సరానికి జనన కాల రవి స్ఫుటం | జన్మ లగ్నము | జన్మ లగ్నము | జన్మ లగ్నము |
| 16 | గోచార పరిశీలనలో ఆరంభ బిందువు | జన్మ రాశి | జన్మ రాశి | జన్మ రాశి | జన్మ రాశి | జనన కాల రవి స్థిత రాశి |
| 17 | దశాధిపత్యము | జన్మ నక్షత్రాదిగా నక్షత్రాధిపతులు | వర్ష ఫల చక్ర ఆధారిత ముద్ద దశలు | రాశులు | జన్మ నక్షత్రాదిగా నక్షత్రాధిపతులు | లేదు |

## సార్థక జ్యోతిష్కుని లక్షణాలు

**అద్వేషీ నిత్య సంతోషీ గణితాగమపారగః ! ముహూర్త గుణ దోషజ్ఞో వాగ్మీ కుశల బుద్ధిమాన్**
**త్రిస్కంధజ్ఞో దర్శనీయః శ్రౌత స్మార్త క్రియాపరః ! నిర్దాంభికః సత్యవాదీ దైవజ్ఞో దైవవిత్ స్థిరః**

**గణితేషు ప్రవీణో యః శబ్ద శాస్త్రే కృత శ్రమః ! న్యాయవిద్ బుద్ధిమాన్ దేశ దిక్కాలజ్ఞో జితేంద్రియః**
**ఊహాపోహ పటుర్హోరా స్కంధ శ్రవణ సమ్మితః ! మైత్రేయ సత్యతాం యాతి తస్య వాక్యం న సంశయః**

# జ్యోతిష్కుల వృత్తి నీతి

**జ్యోతిష్కుడు జాతకాన్ని పరిశీలించి జాతకుడికి చెప్పేటప్పుడు మంచిని ఎక్కువగా, చెడుని తక్కువగా చెప్పాలి.**
**జాతకంలో గ్రహాలు చెడు చేస్తాయి అని అనుకున్నప్పుడు మంచిని కూడా చేస్తాయి. మంచి వాటి గురించి ఆలోచింపజేయాలి. చెడ్డవాటిని వర్ణించకూడదు.**
**ఎదుటి వ్యక్తిని మెప్పించటం కోసం లేనివి చెప్పటం తగదు. అది మంచి అయినా చెడు అయినా సరే.**
**గ్రహాలలో పాజిటివ్, నెగిటివ్ అనే రెండు కారకత్వాలు ఉంటాయి. రెండింటి సమన్వయంతో జాతక పరిశీలన చేయాలి.**
**జాతకములో మరణమునకు సంబంధించిన ఫలితములను చెప్పకూడదు.**

!!శ్లో!! రాజద్రోహం చ చోరత్వం స్త్రీదోషం నిధి దర్శనమ్!
అనర్థాపాదకం కర్మ జ్ఞాతమప్య ప్రకాశయేత్

**రాజ ద్రోహము, దొంగతనము, స్త్రీ దోషము, నిధి నిక్షేపాల ఉనికికి సంబంధించిన సూచన, అనర్థాలకు దారి తీసే పనులను చేయమని సూచించడము – మొదలైన విషయాలను తెలిసినప్పటికీ చెప్పుట జ్యోతిష్కులకు నిషేధించ బడినది**

## జ్యోతిషం ఫలితాలు తప్పుటకు కారణములు

శ్లో॥ అనేక వక్త్రోద్భవ భిన్నభావైః
పంచాంగభేదైశ్చ, కలినా చ కించిత్
అనిచ్ఛతా గర్భగతేన వక్తుం
అనుల్బణం జాతక భాగమజ్ఞైః॥

తా॥ జ్యోతిష శాస్త్రమందలి జాతక ఫలితముల తప్పగుటకు 5 కారణములున్నవి. 1–పూర్వ ఋషులలో అభిప్రాయ భేదములు 2.పంచాంగ భేదములు (ఉదాహరణ:– కె.పి.అయనాంశ బి.వి.రామన్ అయనాంశలకు 1 డిగ్రీ 20ని॥ల తేడా ఉన్నది. దీనివలన జన్మకాలదశాశేషము తేడావచ్చును). 3.కలికాల మహిమ 4.శాస్త్ర రహస్యములను శిష్యులకు, గురువులు పూర్తిగా చెప్పకపోవుట. 5.శాస్త్ర పాండిత్యము పూర్తిగా తెలియనివారు జ్యోతిషము చెప్పుట ఈ ఐదు జాతక ఫల వైఫల్యమునకు హేతువులగుచున్నవి.

### వీరికి జాతకఫలము చెప్పరాదు

శ్లో॥ నోదీరయే దుక్తమపివృధాతత్
విశ్వాసహీనాయచ నాస్తికాయ।
అనర్థదాయావినయాయ నిత్యం
కుశంకినే వా బహుగర్వ్యావాచే॥

తా॥ నమ్మకము లేనివారికి, దేవుడు లేడను నాస్తికులకు – డబ్బు ఇవ్వనివారికి – వినయము లేనివారికి – అన్నింటినీ సందేహించు వారికి – అతిగా మాట్లాడువానికి – జాతకము చెప్పరాదు. చెప్పినచో ఫలించదు.

# వర్గ చక్రములు – మౌలిక భావనలు

**భవనాది పై: సమస్తం జాతక విహితం విచిన్తయేన్మతిమాన్!**
**ఏభిర్వినా న శక్యం పదమపి గంతుం మహా శాస్త్రే!!**

జాతకమునందు చెప్పబడిన వివిధ భావ ఫలితములను సమగ్రముగా తెలుసుకోవడానికి ఆయా భావముల వర్గులను పరిశీలించ వలసి వుంది. ఈ వర్గులను గురించి తెలుసుకోకుండా జ్యోతిశ్శాస్త్రమందలి విషయములను తెలుసుకోవడం అసాధ్యము.

**రాశి చక్రము "క్షేత్రము". మిగిలిన వర్గ చక్రాలకు మూలము. దాని లోని ఒక్కొక్క రాశినీ (అనగా ప్రతి 30 భాగలను) ఒక్క అంశ గా భావించి మరి కొన్ని ఎక్కువ "అంశలు" గా విభజించి ప్రతి అంశా ఒక రాశి గా ఒక వర్గ చక్రము నిర్మించుకొని వివిధ భావ ఫలితములను లోతుగా దర్శించుటయే వర్గ చక్ర విశ్లేషణా లక్ష్యము.**

**రాశి చక్రములో గ్రహము యొక్క స్థూల స్థితి తెలుస్తుంది. వర్గ చక్రము లో ఆ గ్రహము యొక్క సూక్ష్మ స్థితి మరియు గ్రహము యొక్క "ప్రభావ సామర్థ్యము" అవగతమవుతుంది. గ్రహము యొక్క ప్రభావము సూక్ష్మ స్థితి నుండి గమనించినప్పుడు కచ్చితత్వము ఎక్కువగా వుంటుంది.**
**పరాశర మహర్షి తన శ్రోత, మైత్రేయుడికి చెప్పినట్టుగా బృహత్పరాశర హోరా శాస్త్రములో, షోడశ వర్గోధ్యాయములో 16 వర్గ చక్రముల భావన ఆవిష్కరించ బడినది.**

## రాశి చక్రము – వర్గ చక్రములు

| | | | |
|---|---|---|---|
| మీనం | మేషం | వృషభం | మిధునం |
| కుంభం | రాశి చక్రం | | కర్కాటకం |
| మకరం | (క్షేత్రము) | | సింహం |
| ధనుస్సు | వృశ్చికం | తుల | కన్య |






రాశి (1) , హోరా (2), ద్రేక్కాణ (3), నవాంశ (9)
ద్వాదశాంశ (12) త్రింశాంశ (30) > షడ్వర్గులు;
*షడ్వర్గులు* + సప్తమాంశ (7) > సప్త వర్గులు; *సప్త వర్గులు* +
దశాంశ (10) షోడశాంశ (16) షష్ట్యంశ (60) > దశ వర్గులు
*దశ వర్గులు* + చతుర్థాంశ (తురీయాంశ, పదాంశ) (4) వింశాంశ (20)
చతుర్వింశాంశ (సిద్ధాంశ) (24) సప్త వింశాంశ (భాంశ, నక్షత్రాంశ,
తాంత్రికాంశ) (27) ఖ వేదాంశ (చత్వారింశాంశ) (40) అక్ష వేదాంశ
(పంచ చత్వారిమ్సాంశ) (45) > షోడశ వర్గులు

ద్వాదశ వర్గులు: షోడశ వర్గుల లోనివి 8 {రాశి (1) హోరా (2) ద్రేక్కాణ (3) చతుర్థాంశ (తురీయాంశ, పదాంశ) (4) సప్తమాంశ (7) నవాంశ (9) దశాంశ (10) ద్వాదశాంశ (12)} మరియు పంచమాంశ (5) షష్ఠమ్స (6) అష్టమాంశ / అష్టాంశ (8) ఏకాదశాంశ (11)

### 2/30 హోరా - షడ్వర్గు

రాశీని రెండు భాగాలుగా విభజించి పరిశీలించడం జరుగు తుంది. ప్రతి హెూర 15డిగ్రీల ప్రమాణములో రాశీచక్రములో 24హెూరలుగా విభజించబడి ఉంటుంది .ఇది ధనభావము నకు(2కు) సంబంధించి న లోతుగా పరిశీలిస్తారు. అనుభవ జ్ఞులైన వారు మాట పొందిక , ఆహారపు టలవాట్లు, అకారము పరిశీలిస్తారు.

### 3/30 ద్రేక్కాణ - షడ్వర్గు

రాశిని 3భాగలుగా చేసి పరిశీలించడం జరుగు తుంది. ఇది తృతీయ భావముకు చెందిన సూక్ష్మమైన పరిశీలన.తన కంటే చిన్నవారైన సోదర సోదరీలగురించి అలాగే ధైర్యసాహస ములు, ప్రజ్ఞ, కష్టించి పనిచేయడం వంటి విషయాలను, శరీరాంగములను 36ద్రేక్కాణాలుగా విభజించి రోగాదులు,బలహీనతలు మరియు మరణహేతువును తెలుసు కోవచ్చును. ప్రత్యేకించి రోగభావాన్ని పరిశీలించడానికి విశేషంగా ఉపయోగపడుతుంది.

### 30/30 త్రింశాంశ - షడ్వర్గు

త్రింశాంశ-రాశిని 30భాగములుగా విభజిస్తే దానిని త్రింశాంశ అంటారు. ఇది 1డిగ్రీ ప్రమాణముతో రాశీచక్రములో 360 త్రింశాంశలు ఉంటాయి. త్రింశాంశ అనుసరించి అరిష్ట ఫలితము లను విచారణచేయవచ్చని చెప్పబడింది. వివాదములు, సంబంధ ములు విడిపోవడం, వంటివి తెలుసుకోవచ్చును. ఒక విధంగా చెప్పాలంటే షష్ఠభావము యొక్క సూక్ష్మ పరిశీలినగా చెప్పవచ్చును.

### 9/30 నవాంశ (ధర్మాంశ)- షడ్వర్గు

రాశీని తొమ్మిది భాగాలుగా విభజించి పరిశీలించడం జరుగు తుంది. ప్రతి నవాంశ 3డిగ్రీల 20ని॥ల ప్రమాణములో రాశీచక్రములో 108నవాంశ లుగా విభజించబడి ఉంటుంది కళత్రము.కళత్ర స్వభావము, వైవాహిక జీవితము, సాంఘికస్థితులను దీనినిబట్టి తెలుసుకుంటారు. అందుకే మనవాళ్ళు జాతకచక్రము అనగానే రాశి నవాంశలను వేసి పరిశీలన చేస్తారు.

### 12/30 ద్వాదశాంశ - షడ్వర్గు

ద్వాదశాంశ-రాశిని 12భాగాలుగా విభజిస్తే దానిని ద్వాదశాంశ అంటారు. ఇది 2డిగ్రీల 30ప్రమాణముతో రాశీచక్రములో 144 ద్వాదశాంశలు ఉంటాయి. ఇది తల్లితండ్రులకు సంబంధించిన విషయములు, పితృసంబంధమైన విషయాలను సమగ్రంగా పరిశీలించవచ్చును. ఇది 9వ భావమునకు సంబంధించిన సూక్ష్మ విభాగమని చెప్పవచ్చును.

### 7/30 సప్తమాంశ - సప్తవర్గు

రాశిని 7భాగాలుగా విభజించి పరిశీలించబడుతుంది. ప్రతి భాగము 4డిగ్రీల 17నిమిషాల అవధి కలిగి రాశీచక్రము 84సప్తమాంశలుగా విభ జించబడిఉంటుంది. ఇది 5వ భావాని కి చెందిన సూక్ష్మమైన పరిశీలన. దీనినిబట్టి వారసత్వము, సంతానము, మనుమలు వారి స్థితిగతుల పరిశీలన జరుగుతుంది.

## 10/30 దశమాంశ - దశవర్గు

రాశిని 10భాగాలుగా పరిశీలించబడుతుంది. ప్రతి దశమాంశ 3డిగ్రీల ప్రమాణముతో రాశీచక్రములో మొత్తం 120దశమాంశలు ఉంటాయి. ఇది దశమ భావానికి సంబంధించిన సూక్ష్మ పరిశీలన. పేరు ప్రఖ్యాతులు, రాజగౌరవం, ఉద్యోగము, పదవీలాభము వంటి విషయలను సంబంధించిన సమగ్ర పరిశీలన చేయబడుతుంది.

## 16/30 షోడశాంశ - దశవర్గు

షోడశాంశ-రాశి 16భాగములుగా చేస్తే దానిని షోడశాంశ అంటారు ప్రతి షోడశాంశ 1డిగ్రీ 52నిమిషముల 30సెకన్ల ప్రమాణము కలిగి రాశీ చక్రములో 182 షోడశాంశలు ఉంటాయి. ఈ షోడశాంశ మును అనుసరించి కుటుంబసౌఖ్యము, సుఖము, భూములు, వాహనములు, మాతృసౌఖ్యములకు సంబంధించిన విషయముల సూక్ష్మ పరిశీలనగా చెప్పవచ్చును. అంటే చతుర్ధభావానికి సంబంధించిన సూక్ష్మ పరిశీలనగా చెప్పవచ్చును.

## 60/30 షష్ట్యంశ - దశవర్గు

షష్ట్యంశ-రాశిని 60భాగములుగా విభజిస్తే దానిని షష్ట్యంశ అంటారు. ప్రతి షష్ట్యంశ 30నిమిషముల ప్రమాణముతో రాశీచక్రములో 720 షష్ట్యంశలుంటాయి దీనిని బట్టి గ్రహముల శుభాశుభములను గురించి తెలుసుకోవచ్చని చెప్పబడింది. ఒక విధంగా చెప్పాలంటే రాశీచక్రములో గ్రహముల స్థితిని వాటి శుభాశుభత్వాన్ని షష్ట్యంశ చక్రముద్వారా నిర్ధారణ చేయవచ్చును.

## 4/30 చతుర్ధాంశ - షోడశవర్గు

రాశిని 4భాగాలుగా విభజించి పరిశీలించబడుతుంది. ప్రతి చతుర్ధాంశ 7డిగ్రీల 30నిమిషాల ప్రమాణం కలిగి రాశిచక్రములో 48చతుర్ధాంశలు ఉంటాయి. ఇది 4వభావానికి సంబంధించిన సూక్ష్మవిభాగ పరిశీలన. ఈ చక్రాన్ని బట్టి అదృష్టము, స్థిరచరాస్థులు, తల్లితోసంబంధము, మానసిక శాంతి, వాహనసుఖము వంటి విషయాలను మరింత సమగ్రంగా తెలుసుకోవచ్చును.

## 20/30 వింశాంశ - షోడశవర్గు

వింశాంశ-రాశిని 20భాగములుగా చేస్తే దానిని వింశాంశ అంటారు ప్రతి వింశాంశ ప్రమాణము 1డిగ్రీ 30నిమిషముల ప్రమాణముతో రాశిచక్రములో రాశీచక్రములో 240 వింశాంశలు ఉంటాయి. దీనిని బట్టీ ధ్యానము, ఆరాధన, భక్తి, గ్రంథముల పరిశీలన, జపము, ఉపాసనల వంటివాటిని పరిశీలించవచ్చును. ఇంకా నైతికత, కష్టించే విధానముల గురించి తెలుసుకోవచ్చని చెపుతారు. ఇది పంచమ నవమ భావములకు సంబంధించిన సూక్ష్మపరిశీలనగా చెప్పవచ్చును.

## 24/30 చతుర్వింశాంశ (సిద్ధాంశ)- షోడశవర్గు

చతుర్వింశాంశ-రాశిని 24భాగములు చేస్తే అది చతుర్వింశాంశ అవుతుంది. రాశీచక్రము 288 చతుర్వింశాంశలుగా విభజించబడింది. ఒకొక్క చతుర్వింశాంశ ప్రమాణము 1డిగ్రీ 15నిమిషముల ప్రమాణము కలిగి ఉంటుంది. ఉన్నత విద్య, జ్ఞానము, విద్య, మానసికబలమువంటి విషయములను ఇందు సూక్ష్మంగా పరిశీలించే అవకాశము ఉంటుంది. ఇది 9భావమునకు సంబంధించిన సూక్ష్మపరిశీలన.

## 27/30 సప్త వింశాంశ - షోడశవర్గు

సప్తవింశాంశ-రాశిని 27భాగములు చేస్తే దానిని సప్తవింశాంశ అంటారు. ప్రతి సప్తవింశాంశ 1డిగ్రీ 6నిమిషముల 40సెకన్ల ప్రమాణముతో రాశీచక్రములో 324 సప్తవింశాంశలు ఉంటాయి. ఇది భౌతిక, మానసిక ఆధ్యాత్మికశక్తుల గురించి సమగ్ర పరిశీలనగా చెప్పవచ్చును. అంటే ఇది లగ్న,పంచమ,నవమభావములకు సంబంధించిన సూక్ష్మపరిశీలన అన చెప్పవచ్చును.

## 45/30 అక్షవేదాంశ - షోడశవర్గు

అక్షవేదాంశ-రాశిని 45భాగములుగా విభజిస్తే దానిని అక్షవేదాంశ అంటారు. ప్రతి అక్షవేదాంశ 40నిమిషముల ప్రమాణముతో రాశీచక్రములో 540 అక్షవేదాంశలు ఉంటాయి. దీనిని బట్టి జాతకునికి సుఖసంతోషములగురించి తెలుసుకోవచ్చని చెపుతారు.

## 40/30 ఖవేదాంశ - షోడశవర్గు

ఖవేదాంశ-రాశిని 40భాగములు చేస్తే దానిని ఖవేదాంశ అంటారు. ఇది 45నిమిషముల ప్రమాణముతో రాశీచక్రములో 480 ఖవేదాంశ లుగా విభజించబడి ఉంటుంది. దీనిని బట్టి గ్రహముల శుభాశుభములను తెలుసుకోవచ్చని చెప్పబడింది. **రాశి చక్రములోని గ్రహముల పాపయోగముల ఫలితములను ఖవేదాంశలో చక్కగా** పరిశీలించవచ్చని చెపుతారు. అరిష్టభంగాలను దశాఫలితాలను సమగ్రంగా తెలుసుకోవచ్చును.

## 5/30 పంచాంశ - ద్వాదశవర్గు

పంచాంశ-రాశిని 5భాగములుగా విభజిస్తే దానిని పంచాంశ అంటారు. ఒకొక్క పంచాంశ 6డిగ్రీల ప్రమాణముతో రాశీచక్రములో 60 పంచాంశలుంటాయి. దీనిని బట్టి ఆధ్యాత్మిక చైతన్యం,మనోసంకల్పము, ఉన్నతవిద్య గ్రంథరచనాదులను గురించి తెలుసుకోవచ్చునని చెపుతారు. అంటే ఇది 5వ భావము యొక్క సమగ్రమైన పరిశీలనగా చెప్పవచ్చును.

## 6/30 షష్టాంశ - ద్వాదశవర్గు

షష్టాంశ-రాశిని 6భాగములుగా విభజిస్తే దానిని షష్ఠంశ అంటారు. ఒకొక్క షష్ఠంశ 5డిగ్రీల ప్రమాణముతో రాశీచక్రములో 72షష్ఠంశలు ఉంటాయి. దీనిని బట్టి **ఆరోగ్యము, శత్రువులు, శత్రువులపై జయము, ఋణములు, ఋణములు** తీర్చే విధానముల గురించి సమగ్రంగా విచారణ చేయవచ్చని పండితులు చెపుతారు.

## 8/30 అష్టాంశ - ద్వాదశవర్గు

**అష్టాంశ**-రాశిని 8భాగములుగా విభజిస్తే దానిని అష్టాంశ అంటారు. ఒకొక్క అష్టాంశ 3 డిగ్రీల 45నిమిషముల ప్రమాణముతో రాశీచక్రములో 96 అష్టాంశలు ఉంటాయి. ఇది ఆయుర్దాయము, పరిశోధన, వివాదములు, మరణములు, ఉద్యోగములో బదిలీలువంటి విషయములను తెలుసుకోవడానికి సహకరిస్తుందని చెపుతారు.

## 11/30 ఏకాదశాంశ - ద్వాదశవర్గు

ఏకాదశాంశ-రాశిని 11భాగములు చేస్తే దానిని ఏకాదశాంశ అంటారు. ఒకొక్క ఏకాదశాంశ 2డిగ్రీల 43నిమిషముల 38సెకన్ల ప్రమాణముతో రాశీచక్రములో 132 ఏకాదశాంశలు ఉంటాయి. ఇది 11వభావానికి సంబంధించిన సూక్ష్మ పరిశీలన దీనిని బట్టి జ్యేష్ఠసోదరులు, మిత్రుల సహాయసహకారములు, అన్ని విషయాలలో లాభములు వంటి విషయములను పరిశీలించవచ్చని చెపుతారు.

## జాతక విశ్లేషణ కు షోడశ వర్గులు – సారాంశ పట్టిక 1

| క్ర సం | వర్గ చక్రము పేరు | రాశి భాగలు | నిడివి - డిగ్రీలు | ఫలితాంశము |
|---|---|---|---|---|
| 1 | రాశి (క్షేత్ర) | 1 | 30 డి | శరీరం, సాధారణ అంశాలు |
| 2 | హోరా | 2 | 15 డి | మనోభావాలు, స్థిరత్వము, సంపదలు, ఆర్థిక స్థితి, అభ్యున్నతి, పేదరికము మొ. |
| 3 | ద్రేక్కాణ | 3 | 10 డి | సోదరులు, సహకారము, ఆరోగ్యము మొ. |
| 4 | నవాంశ | 9 | 3డి 20 ని | గ్రహముల బలాబలములు, జీవితములో ఉత్థాన పతనములు, వైవాహిక జీవితము, జీవిత భాగస్వామి స్వభావాదులు, వ్యాపార భాగస్వామ్యములు మొ. |
| 5 | ద్వాదశాంశ | 12 | 2డి 30 ని | తల్లితండ్రులు, వారి వలన సౌఖ్యము, పూర్వ పర జీవితముల సంబంధము |
| 6 | త్రింశాంశ | 30 | 1డి | కష్టములు, జీవితములోని ప్రమాదములు, అరిష్టములు, సాధారణంగా సంభవించు అశుభములు, వ్యక్తిత్వము, సౌశీల్యము, ఆయువు మొ. |
| ఈ షట్చక్రాల సమూహాన్ని "షడ్వర్గులు" అంటారు | | | | |
| 7 | సప్తమాంశ | 7 | 4డి 17ని 9సె | పుత్ర పౌత్రాది సంతానము, వారి అభివృద్ధి, స్త్రీలకు భర్త అభ్యున్నతి, క్షేమము |
| ఈ ఏడు చక్రాల సమూహాన్ని "సప్త వర్గులు" అంటారు | | | | |

## జాతక విశ్లేషణ కు షోడశ వర్గులు సారాంశ పట్టిక - 2

| క్ర సం | వర్గ చక్రము పేరు | రాశి భాగలు | నిడివి - డిగ్రీలు | ఫలితాంశము |
|---|---|---|---|---|
| 8 | దశాంశ | 10 | 3డి | కీర్తి ప్రతిష్ఠలు గౌరవము, అభ్యున్నతి, వృత్తి ఉద్యోగ వ్యాపారములు మొ. |
| 9 | షోడశాంశ | 16 | 1డి 52ని 30 సె | సుఖ దుఃఖములు, భోగములు, వాహన సౌకర్యములు, వాహన ప్రమాదములు |
| 10 | షష్ట్యంశ | 60 | 30 ని | పునర్జన్మ కారణము, కర్మ ఫలితములు, కవల పిల్లల జాతక విశ్లేషణ |
| ఈ పది చక్రాల సమూహాన్ని "దశ వర్గులు" అంటారు | | | | |
| 11 | చతుర్థాంశ (తురీయాంశ, పదాంశ) | 4 | 7డి 30ని | భాగ్యము (అదృష్టము) స్థిర చరాస్తులు |
| 12 | వింశాంశ | 20 | 1డి 30ని | ఆధ్యాత్మిక విషయాలు, ప్రార్థన, పూజ, ఉపాసన |
| 13 | చతుర్వింశాంశ (సిద్ధాంశ) | 24 | 1డి 15 ని | విద్యా సంబంధ విషయములు, ఉన్నత విద్య, విజ్ఞానము, నేర్పు (నైపుణ్యము) మొ. |
| 14 | సప్త వింశాంశ (భాంశ, నక్షత్రాంశ, తాంత్రికాంశ) | 27 | 1డి 6ని 40సె | శారీరక బలము, బలహీనత మొ. |
| 15 | ఖ వేదాంశ (చత్వారిమ్శాంశ) | 40 | 45ని | మాతృ వంశము, సాధారణ శుభాశుభములు, మంచి చెడులు |
| 16 | అక్ష వేదాంశ (పంచ చత్వారిమ్శాంశ) | 45 | 40ని | పితృ వంశము, శీలస్వభావములు |
| ఈ పదహారు చక్రాల సమూహాన్ని "షోడశ వర్గులు" అంటారు | | | | |

# తాజక పద్ధతి లో ఉపయోగించే ద్వాదశ వర్గ చక్రాలు

| క్ర సం | వర్గ చక్రము పేరు | రాశి భాగలు | నిడివి - డిగ్రీలు | ఫలితాంశము |
|---|---|---|---|---|
| తాజక పద్ధతి లో క్రింద ఇచ్చిన ద్వాదశ వర్గ చక్రాలు వుంటాయి | | | | |
| 1 | రాశి (క్షేత్ర) | 1 | 30 డి | శరీరం, సాధారణ అంశాలు |
| 2 | హోరా | 2 | 15 డి | మనోభావాలు, స్థిరత్వము, సంపదలు, ఆర్థిక స్థితి, అభ్యున్నతి, పేదరికము మొ. |
| 3 | ద్రేక్కాణ | 3 | 10 డి | సోదరులు, సహకారము, ఆరోగ్యము మొ. |
| 4 | చతుర్థాంశ (తురీయాంశ, పదాంశ) | 4 | 7డి 30ని | భాగ్యము (అదృష్టము) స్థిర చరాస్తులు |
| 5 | పంచమాంశ | 5 | 6డి | పారలౌకిక ఆసక్తి, ధార్మికత, మతము, పూర్వ పుణ్యము, ఉపాసన ఆధ్యాత్మిక పరిణామ స్థాయి మొ. |
| 6 | షష్ఠమ్శ | 6 | 5డి | న్యాయ సమస్యలు, వ్యాధులు/ఆరోగ్యం, ఉపశమనము మొ. |
| 7 | సప్తమాంశ | 7 | 4డి 17ని 9సె | పుత్ర పౌత్రాది సంతానము, వారి అభివృద్ధి, స్త్రీలకు భర్త అభ్యున్నతి, క్షేమము |
| 8 | అష్టమాంశ / అష్టాంశ | 8 | 3డి 45ని | ఆయుర్దాయం |
| 9 | నవాంశ | 9 | 3డి 20 ని | గ్రహముల బలాబలములు, జీవితములో ఉత్థాన పతనములు, వైవాహిక జీవితము, జీవిత భాగస్వామి స్వభావాదులు, వ్యాపార భాగస్వామ్యములు మొ. |
| 10 | దశాంశ | 10 | 3డి | కీర్తి ప్రతిష్ఠలు గౌరవము, అభ్యున్నతి, వృత్తి ఉద్యోగ వ్యాపారములు మొ. |
| 11 | ఏకాదశాంశ | 11 | 2 డి 43ని:38సె | వారసత్వ సంపదలు, దానం, ఊహించి సాధించు ఫలితములు, జూదము, ఎన్నికలలో విజయము మొ. |
| 12 | ద్వాదశాంశ | 12 | 2డి 30 ని | తల్లితండ్రులు, వారి వలన సౌఖ్యము, పూర్వ పర జీవితముల సంబంధము |

# భావములు – జాతక విశ్లేషణ కొరకు సంబంధిత వర్గులు

## సారాంశ పట్టిక

| క్ర సం | భావము | షడ్వర్గులు | సప్తవర్గులు | దశవర్గులు | షోడశవర్గులు | ద్వాదశ వర్గులు |
|---|---|---|---|---|---|---|
| 1 | 1 నుండి 12 | రాశి | - | షష్ట్యంశ | - | రాశి |
| 2 | 1 | - | - | - | సప్తవింశాంశ | - |
| 3 | 2 | హోరా | - | - | - | హోరా |
| 4 | 3 | ద్రేక్కాణ | - | - | - | ద్రేక్కాణ |
| 5 | 4 | - | - | షోడశాంశ | చతుర్థాంశ | చతుర్థాంశ |
| 6 | 5 | - | సప్తమాంశ | - | వింశాంశ, సప్తవింశాంశ, అక్షవేదాంశ | సప్తమాంశ, పంచాంశ |
| 7 | 6 | త్రింశాంశ, ద్రేక్కాణ, | - | - | | షష్టాంశ |
| 8 | 7 | నవాంశ | - | - | | నవాంశ |
| 9 | 8 | - | - | - | ఖవేదాంశ | అష్టాంశ |
| 10 | 9 | ద్వాదశాంశ | - | - | వింశాంశ, చతుర్వింశాంశ, సప్తవింశాంశ, అక్షవేదాంశ | ద్వాదశాంశ |
| 11 | 10 | - | - | దశాంశ | - | దశాంశ |
| 12 | 11 | - | - | - | - | ఏకాదశాంశ |
| 13 | 12 | ద్వాదశాంశ | - | - | - | - |

# వర్గ చక్రములు – మౌలిక భావనలు

1.ఏ వర్గ చక్రమునకైనా రాశి చక్రములోని గ్రహ స్ఫుటమే ప్రాతిపదిక.

2.ద్వాదశ భావాలకు సంబంధించి లోతైన పరిశీలన కొరకు ఒక్కో భావానికి ఒక్కో వర్గ చక్రము ఉపయోగించ వలసి వుంటుంది.

3.రాశి చక్రములో సూచించ బడని ఫలితము వర్గ చక్రముల ద్వారా లభించదు.

4.వర్గ చక్రముల ద్వారా ఫలితములు తెలుసుకోవడానికి ఆయా వర్గ చక్రమును సంబంధిత రాశి చక్రము తో కలిపి పరిశీలించవలసి వుంటుంది.

5.వర్గ చక్రములు రాశి చక్రము వలె స్వతంత్రముగా పరిశీలించ తగినవి కాదు. అవి జాతక విశ్లేషణ లో "అనుబంధ సాధనములు" మాత్రమే.

6.ఏ గ్రహమైనా రాశి చక్రములో మరియు సంబంధిత వర్గ చక్రములో ఒకే రాశి లో స్థితి పొందినచో దానిని *వర్గోత్తమ స్థితి* అంటారు. వర్గోత్తమం చెందిన గ్రహములు కచ్చిత ఫలితములను యిస్తాయి.

7.రాహు కేతువులు రాశి చక్రములో సదా సమ సప్తకములో (1/7 అక్షము) మాత్రమే వుంటారు. వర్గ చక్రములలో ఉండక పోవచ్చును.

8. "లగ్నము" ను కూడా ఒక "గ్రహము" వలె భావించి లగ్న స్ఫుటము ఆధారంగా, వర్గ చక్రములలో లగ్న రాశి ని కూడా గణించాలి/గుర్తించాలి.

# వర్గ చక్రములు – పరిశీలనా విధానము

1.వర్గ చక్రముల ద్వారా ఫలితములు సూచించడానికి కచ్చితమైన "జనన కాల సమయము" తో నిర్మించిన జాతకము ఎంతో అవసరము.

2.జాతక విశ్లేషణ లో వర్గ చక్రములను ఉపయోగించినప్పుడు రాశి చక్రమును, సంబంధిత వర్గ చక్రమును ఏక కాలములో పరిశీలించాలి. (వివాహ పొంతన లో జాతకములను పరిశీలించే విధంగా)

3.రాశి చక్రము తో పాటు విశ్లేషించే వర్గ చక్రమును, సంబంధిత భావ విశ్లేషణ కే పరిమితం చేయాలి. (ఉదా: వృత్తి విషయములో "దశాంశ")

4.వైవాహిక జీవన విషయంగా కళత్ర భావ విశ్లేషణ చేస్తున్నప్పుడు, జన్మ కుండలి తో పాటు వివాహం జరిగిన ముహూర్త కుండలి కూడా పరిశీలించాలి.

5.వర్గ చక్ర పరిశీలన లో జన్మ కుండలి లో వున్నట్టుగా ద్వాదశ భావ విభజన, భావాధిపత్యము పరిగణించాలి. గ్రహములకు దృష్టులు కూడా పరిగణించాలని కొందరి మతము.

6.వర్గ చక్రములో స్వక్షేత్ర, మిత్ర/శత్రు క్షేత్ర, మూల త్రికోణ, ఉచ్చ, నీచ మొదలగు అంశములు అన్వయించాలి. వీటి ఆధారం గానే "స్వవర్గు" స్థితి తెలుస్తుంది.

7.రాశి చక్రములో లగ్నాధిపతి – లగ్నేషు, వర్గ చక్రములో లగ్నాధిపతి – వర్గేషు, రాశి చక్రములో భావాధిపతి – భావేషు, వర్గ చక్రములో భావాధిపతి – కార్యేషు గా గ్రహించాలి.

8.రాశి చక్రము లోని లగ్నము, వర్గ చక్రములోని లగ్నము పరస్పరం ఏ "అక్షము" లో వున్నాయో గమనించాలి.

## వర్గ చక్రములు – పరిశీలనా విధానము

9. రాశి చక్రములో భావముల రాశులను, సంబంధిత వర్గ చక్రములో రాశి చక్రపు భావాధిపతి పొందిన స్థితి (కేంద్ర, కోణ, స్వక్షేత్ర, ఉచ్ఛ మొ.) మరియు అక్షమును గమనించ వలెను.

10. వర్గ చక్రములోని గ్రహములు దిగ్బలము పొందినవా లేదా గమనించాలి. సంబంధిత భావేషుడు దిగ్బలం పొందితే ఆ భావమునకు సంబంధించి మంచి ఫలితములు ఉండునని గ్రహించాలి.

11. వర్గ చక్రముల విశ్లేషణ లో సంబంధిత భావ ఫలిత సూచనకై ఆయా చక్రములలో జాతకుడి తత్కాల దశా నాధుడి స్థితి – గమనించడం చాలా ముఖ్య మైన అంశము. తత్కాల దశా నాధుడు, లగ్నమునకు శుభుడా కాదా అన్న విషయము, జన్మ కుండలి లో ఆ గ్రహమునకు వున్న బాధ్యతలు కూడా పరిగణించాలి.

12. గ్రహములకున్న సహజ భావ కారకత్వము ను, రాశి మరియు సంబంధిత వర్గ చక్రములలో వాటి స్థితిని – సమన్వయం చేసుకొని అవి పొందిన వర్గీయ బలమును గమనించాలి.

13. జాతక విశ్లేషణ చేస్తున్నప్పుడు **గోచార స్థితి ని** గమనించి రాశి లోని భావ ఫలములను వర్గ చక్రములో గ్రహముల స్థితి ని పోల్చి భావ ఫలము అనుభవములోనికి వచ్చు కాలము ను సూచించ వలయును.

14. వర్గ చక్రములలో ఏర్పడిన యోగములు కూడా గమనించాలి. అవి ఫలితములు అనుభవమునకు వచ్చు దశా కాలమును సూచిస్తాయి.

## *రాశి చక్రము లో చర జ్యోతిస్సుల (గ్రహముల) పరిభ్రమణ వేగము*

*గ్రహముల గమనం – నిరంతరం (సుమారు)*

| గ్రహము | ఒక రాశి లో | ఒక నక్షత్ర పాదములో |
|---|---|---|
| రవి | 30 రోజులు | 3 రోజుల 8 గంటలు |
| చంద్ర | 2 ¼ రోజులు | 6½ గంటలు |
| కుజ | 45 రోజులు | 4 రోజుల 10 ½ గంటలు |
| బుధ | 25 రోజులు | 2 రోజుల 5½ గంటలు |
| గురు | 12 నెలలు | 1 నెల 10 రోజులు |
| శుక్ర | 25-29 రోజులు | 2 రోజుల 16 గంటలు |
| శని | 30 నెలలు | 3 నెలల 10 రోజులు |
| రాహు/ కేతు | 18 నెలలు | 2 నెలల 2 రోజులు |

*ఫలిత సూచన లో గోచారమును సమన్వయము చేస్తున్నప్పుడు చాలా అవసరమైన సమాచారము*

జాతకము లో గ్రహములకు భావాధిపత్యం తో పాటు ఇతర బాధ్యతలు

## యోగకారక, మారక మరియు బాధక

| లగ్నం | యోగకారక | మారక 2HL, 7HL | బాధక |
|---|---|---|---|
| మేషం | రవి, గురు | శుక్ర | శని 11HL |
| వృషభం | బుధ, శని | బుధ, కుజ | శని 9HL |
| మిధునం | శుక్ర | చంద్ర, గురు | గురు 7HL |
| కర్కాటకం | గురు, కుజ | రవి, శని | శుక్ర 11HL |
| సింహం | కుజ, గురు | బుధ, శని | కుజ 9HL |
| కన్య | శుక్ర, శని | కుజ, గురు | గురు 7HL |
| తుల | శని, బుధ | కుజ | రవి 11HL |
| వృశ్చికం | గురు, చంద్ర, రవి | శుక్ర | చంద్ర 9HL |
| ధనుస్సు | రవి, కుజ | శని, బుధ | బుధ 7HL |
| మకరం | శుక్ర, బుధ | శని, చంద్ర | కుజ 11HL |
| కుంభం | శుక్ర, బుధ | గురు, రవి | శుక్ర 9HL |
| మీనం | చంద్ర, కుజ | శని, బుధ | బుధ 7HL |

## వర్గ చక్రములు – గ్రహముల ‘అంశ బలము’

ఒక గ్రహం, వర్గ చక్రములలో ఎంత బలం పొందినదో – “అంశ బలం” ద్వారా తెలుస్తుంది.

గ్రహము, ఒక వర్గ చక్రములో – తన స్వక్షేత్రములో గాని, మూల త్రికోణ క్షేత్రము లో కానీ, ఉచ్చ క్షేత్రము లో కానీ వున్నచో ఆ వర్గము లో ఒక “అంశ బలము” పొందును. దీని ఆధారముగా గ్రహమునకు వున్న బలహీనత కూడా గమనించ వచ్చును

ఒక జాతకమునకు సంబంధించిన షోడశ వర్గులలో, ఏదేని గ్రహము ఎన్ని వర్గ చక్రములలో బలం పొందినదో ఆ సంఖ్య ఆధారంగా ఆ గ్రహమునకు ఆయా “అంశ బలం” సూచించ బడినది.

వర్గ చక్రములలో ఎక్కువ అంశ బలం పొందిన గ్రహముల “ప్రభావ సామర్ధ్యము” ఎక్కువగా వుంటుంది.

# గ్రహముల స్వక్షేత్ర, మూల త్రికోణ, ఉచ్ఛ క్షేత్రములు

| | | | |
|---|---|---|---|
| గురు స్వ<br>శుక్ర ఉచ్ఛ 27 డి | కుజ స్వ,<br>మూ. 0-12 డి<br>రవి ఉచ్ఛ 10డి | శుక్ర స్వ<br>చంద్ర ఉచ్ఛ 3 డి,<br>చంద్ర మూ.3-30డి | బుధ స్వ |
| శని స్వ<br>మూ. 0–20 డి | | | చంద్ర స్వ<br>గురు ఉచ్ఛ 5 డి |
| శని స్వ<br>కుజ ఉచ్ఛ 28 డి | | | రవి స్వ,<br>మూ 0 -20 డి |
| గురు స్వ<br>మూ 0 – 10 డి | కుజ స్వ | శుక్ర స్వ<br>మూ. 0-15 డి<br>శని ఉచ్ఛ 20 డి | బుధ స్వ<br>మూ 15 -20 డి<br>ఉచ్ఛ15 డి |

# వర్గ చక్రములు – గ్రహములకు వర్గీయ బలములు

గ్రహముల వర్గీయ బల సాధన లో వాటి సాముదాయిక వర్గీయ బలము ను సూచించుటకు ఋషులు ప్రత్యేక నామములతో అంశ బలం వివరించారు. వర్గ చక్రముల వర్గీకరణను అనుసరించి వివిధ అంశ బలముల పేర్లు వుంటాయి. ఉదా: దశ వర్గులలో రెండు వర్గములలో గ్రహము అంశ బలము పొందిన, గ్రహము "పారిజాతాంశ" లో వున్నట్టు గ్రహించాలి

| వర్గసంఖ్య | షడ్వర్గ | సప్తవర్గ | దశవర్గ | షోడశవర్గ |
|---|---|---|---|---|
| 2 | కింసుకం | కింసుకం | పారిజాతం | భేదకము |
| 3 | వ్యంజనం | వ్యంజనం | ఉత్తమము | కుసుమము |
| 4 | చామరము | చామరము | గోపురము | నాగపుష్పము |
| 5 | ఛత్రము | ఛత్రము | సింహాసనం | కందుకము |
| 6 | కుండలము | కుంబలము | పారవతము | కేరలము |
| 7 | - | ముకుటము | దేవలోకము | కల్పవృక్షము |
| 8 | - | - | బ్రహ్మలోకము | చందనివసం |
| 9 | - | - | శక్రవాహనం | పూర్ణచంద్రం |
| 10 | - | - | శ్రీధామము | ఉచ్చైశ్రవము |
| 11 | - | - | - | ధన్వంతరి |
| 12 | - | - | - | సూర్యకాంతం |
| 13 | - | - | - | విద్రుమము |
| 14 | - | - | - | శక్రసింహాసనం |
| 15 | - | - | - | గోలోకము |
| 16 | - | - | - | శ్రీవల్లభము |

# వర్గ చక్రములు – గ్రహముల వింశోపక బలము

గ్రహముల వర్గీయ బల సాధన లో ఒక్కొక్క వర్గ చక్రములో ఎంతెంత బలము పొందినదో రూపాత్మకంగా (అంకెలలో) కూడా "వింశోపక బలము" గా అంశ బలం వివరించారు. వర్గ చక్రముల వర్గీకరణను అనుసరించి "వింశోపక బలము" ప్రతి వర్గముల లోని మొత్తము వింశతి = 20 అని మధించి గణిస్తారు. ఉదా: షోడశ వర్గులలో ఒక గ్రహము రాశి మరియు హోరా చక్రములలో అంశ బలం పొందితే ఆ గ్రహము వింశోపక బలము = 4.5 అవుతుంది.

| వర్గము | షడ్వర్గము | సప్తవర్గము | దశవర్గము | షోడశవర్గము |
|---|---|---|---|---|
| రాశి | 6.0 | 5.0 | 3.0 | 3.5 |
| హెూర | 2.0 | 2.0 | 1.5 | 1. 0 |
| ద్రేక్కాణం | 4.0 | 3.0 | 1.5 | 1.0 |
| చతుర్ధాంశ | - | - | - | 0.5 |
| సప్తమాంశ | - | 2.5 | 1.5 | 0.5 |
| నవాంశ | 5.0 | 4.5 | 1.5 | 3.0 |
| దశాంశ | - | - | 1.5 | 0.5 |
| ద్వాదశాంశ | 2.0 | 2.0 | 1.5 | 0.5 |
| షోడశాంశ | - | - | 1.5 | 2.0 |
| వింశాంశ | - | - | - | 0.5 |
| చతుర్వింశాంశ | - | - | - | 0.5 |
| సప్తవింశాంశ | - | - | - | 0.5 |
| త్రింశాంశ | 1.0 | 1.0 | 1.5 | 1.0 |
| ఖవేదాంశ | - | - | - | 0.5 |
| అక్షవేదాంశ | - | - | - | 0.5 |
| షష్ఠంశ | - | - | 5.0 | 4.0 |
| | 20 | 20 | 20 | 20 |

# తాజక పద్ధతి లో పంచ వర్గీయ, ద్వాదశ వర్గీయ బలము

జాతక విశ్లేషణ తాజక పద్ధతిలో చేసినప్పుడు గ్రహముల క్షేత్ర బలం, ఉచ్ఛ బలం, హద్ద బలం, ద్రేక్కాణ బలం, నవాంశ బలం అనే అయిదు బలముల సాముదాయిక బలమును పంచ వర్గీయ బలముగా గ్రహిస్తారు.

పంచ వర్గీయ బలములతో కూడా "వింశోపక బలం" గణిస్తారు. ఈ వింశోపక బలం అంకెలను బట్టి వర్గీకరించ బడుతుంది. గ్రహమునకు 15 నుండి 20 అంకెల మధ్యన బలం వుంటే "పరాక్రమి", 10 నుండి 15 – "పూర్ణ బలి", 5 నుండి 10 – "మధ్య బలి", 5 అంకెల కన్నా తక్కువగా వుంటే "అల్ప బలి" గా పరిగణిస్తారు.

తాజక పద్ధతి లో వర్గ చక్రములకు సంబంధించి వున్న మరియొక భావన – ద్వాదశ వర్గీయ బలము. గ్రహము, ద్వాదశ వర్గ చక్రములలో (రాశి, హోరా, ద్రేక్కాణ, చతుర్థంశ, పంచమాంశ, షష్ఠంశ, సప్తమాంశ, అష్టమాంశ, నవాంశ, దశాంశ, ఏకాదశాంశ, ద్వాదశాంశ) ఎంత బలం పొందినదో దానిని ద్వాదశ వర్గీయ బలం గా వ్యవహరిస్తారు. ఈ విషయములో "అంశ బలము" పేర్లతో కాకుండా గ్రహము స్థితి చెందిన శుభ వర్గులు ఎన్ని (ఉచ్ఛ, స్వక్షేత్ర) అశుభ వర్గులు ఎన్ని (తటస్థ, శత్రు క్షేత్రములు) అనే ఆధారంగా ఎక్కువ శుభ వర్గులలో వున్న గ్రహమున కు ఎక్కువ ద్వాదశ వర్గీయ బలమున్నట్టు గ్రహిస్తారు.

# వర్గ చక్రములు – కొన్ని విశేషాంశములు

**అంశాత్ అంశ విశ్లేషణ:**

నవ నవాంశ (నవాంశ లో 9వ భాగము)

నవ ద్వాదశాంశ (నవాంశ లో 12 వ భాగము)

వీటిని వ్యక్తి యొక్క పుట్టిన సమయాన్ని సరి చేయటానికి మరియు కవల పిల్లల జాతక విశ్లేషణ కు ఉపయోగిస్తారు.

**వర్గ చక్రాలలో 3 కు వున్న ప్రాశస్త్యము:**

షోడశ వర్గులలో క్రింది 8 వర్గ చక్రాలలో వుండే “అంశ”లు 3 చేత భాగింప బడునవే. వాటికి వున్న సూక్ష్మ సంబంధము పరిశోధించ వలసిన అంశమే.

ద్రేక్కాణ (3), నవాంశ(9), ద్వాదశాంశ (12), చతుర్వింశాంశ (24), సప్త వింశాంశ (27), త్రింశాంశ (30), అక్ష వేదాంశ (45), షష్ట్యంశ (60)

# వర్గ చక్రములు – కొన్ని విశేషాంశములు

**నవాంశ ప్రత్యేకత**

వర్గ చక్రములన్నింటి లో రాశి తరువాత అంతే ప్రాముఖ్యమైనది నవాంశ.

శరీరమునకు వెన్నెముక లాగా రాశి కి నవాంశ కీలకమైనది

మహా దశను రాశి చక్రము లో, అంతర్దశ లను నవాంశ లో పరిశీలించాలి. ఏ గ్రహమునకైనా బలసాధన చేయుటకు నవాంశ స్థితి ని పరిగణించాలి.

జాతక చక్రములో పరిశీలించదగిన ప్రతి విషయాన్ని నవాంశ లో పరిశీలించి విచారణ చేయాలి.

రాశి చక్రం విత్తనమైతే, భావ చక్రం వృక్షమని, నవాంశ చక్రము ఆ వృక్ష ఫలమని పోల్చారు.

అందువల్లనే “అంశ చక్రము” (నవాంశ వర్గ చక్రము) జన్మ కుండలి, భావ చక్రముతో పాటు ప్రతి జాతకములో తప్పకుండా వుంటుంది.

# నవాంశ రాశులు

రాశి చక్రము లో గ్రహమున్న రాశి ని బట్టి నవాంశ చక్రములో ఆ గ్రహము ఏ రాశిలో వుంటుందో క్రింది పట్టిక ద్వారా తెలుస్తుంది. భావాధిపతి వుండే నవాంశ రాశిని బట్టి కూడా జాతక ఫలితాలు గ్రహిస్తారు

| రాశి | సంబంధిత నవాంశ రాశులు |
|---|---|
| అగ్ని తత్వ రాశులు – మేష, సింహ, ధనుస్సు లకు | మేష, వృషభ, మిధున, కర్కాటక, సింహ, కన్య, తుల**, వృశ్చికం, ధనుస్సు** |
| భూ తత్వ రాశులు – వృషభ, కన్య, మకరములకు | మకరం, కుంభం, మీనం**, మేషం, వృషభం**, మిధునం, కర్కాటకం, సింహం, కన్య |
| వాయు తత్వ రాశులు – మిధున, తుల, కుంభములకు | తుల, వృశ్చికం, ధనుస్సు, మకరం, కుంభం, మీనం**, మేషం, వృషభం**, మిధునం |
| జల తత్వ రాశులు – కర్కాటకం, వృశ్చికం, మీనము లకు | కర్కాటక**, సింహ, కన్య**, తుల, వృశ్చిక, ధనుస్సు, మకర, కుంభం, మీనం |

పుష్కర నవాంశలు**

## నవాంశ చక్రము – పుష్కరాంశలు,వర్గోత్తమ నక్షత్ర పాదములు

రాశి ని 9 "పుష్కర" అంశ లుగా గ్రహించి అగ్ని తత్వ రాసులలో 7, 9 నవాంశలు, భూ తత్వ రాసులలో 3, 5 నవాంశలు, వాయు తత్వ రాసులలో 6, 8 నవాంశలు, జల తత్వ రాసులలో 1, 3 నవాంశలు పుష్కర నవాంశలుగా లేదా "పుష్కరాంశ"లుగా ముహూర్త గ్రంధాలలో ప్రస్తావించినారు. సుముహూర్త కాలమును నిర్ణయించడం లో "పుష్కరాంశ" ప్రాధాన్యత మనకు తెలిసినదే.

64 వ నవాంశ అధిపతి ని అత్యంత ప్రతికూల ఫల దాత గా భావిస్తారు. అయితే ఈ నవాంశ గణన, చంద్ర స్ఫుటము నుండి కూడా పరిశీలిస్తారు. జాతకములో 64 వ నవాంశ అష్టమ భావములో వుంటుంది. దీనిని 'ఖర నవాంశ' అని అంటారు.

ఏదేని గ్రహ స్పుటము క్రింది పాదములలో వున్నప్పుడు ఆ గ్రహము నవాంశ చక్రములో వర్గోత్తమం చెందుతుంది.
అశ్విని – 1, రోహిణి – 2, పునర్వసు – 3, 4, పుబ్బ – 1, చిత్త – 2, 3, అనూరాధ – 4, ఉత్తరాషాఢ – 1, 2, శతభిషం – 3, రేవతి – 4

అయితే ఈ వర్గోత్తమ నక్షత్ర పాదములు క్రింది నక్షత్ర పాదములకు వరుసగా 'ఖర నవాంశ' అవుతాయి.
ఉత్తర – 2, స్వాతి – 3, జ్యేష్ఠ – 4, మూల – 1, శ్రవణం – 2, పూర్వాభాద్ర – 3, 4, భరణి – 1, మృగశిర – 2, 3, పుష్యమి – 4, ఉత్తర - 1

ఈ నక్షత్ర పాదములను గుర్తుంచుకుంటే జాతక విశ్లేషణ లో నైపుణ్యం పెరుగుతుంది

## వర్గ చక్రములు – కొన్ని విశేషాంశములు

**ద్రేక్కాణ వర్గ చక్రం – ముఖ్యాంశములు**

నవాంశ చక్రము తరువాత అత్యంత ప్రాధాన్యత ఇవ్వబడిన వర్గ చక్రమిది.

ఒక రాశి లో వుండే 3 ద్రేక్కాణములను వరుసగా నారద, అగస్త్య, దుర్వాస అని అంటారు. రాశి చక్రములో వుండే 36 ద్రేక్కాణములను స్త్రీ, పురుష ద్రేక్కాణములుగా వర్గీకరించినారు.

అలాగే ఆయుధ, పశు (చతుష్పాద), పక్షి (ఖగ), సర్ప అను పేర్లతో కూడా మరొక వర్గీకరణ చేసినారు.

వీటన్నింటి ఆధారముగా, ముఖ్యముగా, ఆరోగ్యమునకు ఆయుర్దాయమునకు సంబంధించిన ఫలితములను సూచించడం సంభవము.

ద్రేక్కాణ వర్గ చక్రము ఒక విధముగా ఈ కాలములో "సమగ్ర ఆరోగ్య పరీక్షల నివేదిక (comprehensive health check up report)" గా ఉపయోగించుకోవచ్చును.

22వ ద్రేక్కాణమును ఖర లేదా మృత్యు ద్రేక్కాణము అని అంటారు. ఇది కూడా జాతకములో అష్టమ భావములోనే వుంటుంది.

## వర్గ చక్రములు – కొన్ని విశేషాంశములు

**షష్ట్యంశ చక్రము**

జాతక విశ్లేషణ లో జన్మ కుండలి, నవాంశ కుండలి తో పాటు పరిశీలించే మరియొక ముఖ్యమైన వర్గ చక్రము షష్ట్యంశ కుండలి.

కవల పిల్లల జాతకములు ఈ చక్రము ఆధారంగానే పరిశీలించ వలసి వుంటుంది.

దశ వర్గులలో మరియు షోడశ వర్గులలో వింశోపక బల సాధన లో ఈ వర్గ చక్రమునకు అన్నింటికన్నా ఎక్కువ గుణములు నిర్దేశించ బడినవి. (5/20 & 4/20)

# వర్గ చక్ర విశ్లేషణ – ప్రధాన అంశముల మాదిరి పట్టిక

| క్ర సం | రాశి చక్రములో | విశ్లేషణా విషయ సంబంధిత భావము | నవాంశ చక్రములో | సంబంధిత వర్గ చక్రములో | విశేషములు |
|---|---|---|---|---|---|
| 1 | | లగ్న రాశి (అక్షము), సానుకూలత | | | |
| 2 | | లగ్నాధిపతి – స్థితి, అక్షము, వర్గీయ బలములు, సానుకూలతలు | | | |
| 3 | | భావాధిపతి – స్థితి, అక్షము, వర్గీయ బలములు, సానుకూలతలు | | | |
| 4 | | లగ్నేషుడి తో సంబంధము ఏర్పడిన గ్రహములు, జాతకములో వారి బాధ్యతలు, సానుకూలతలు | | | |
| 5 | | లగ్నమునకు శుభులు, వారి స్థితి, బలములు, సానుకూలతలు | | | |
| 6 | | లగ్నమునకు అశుభులు, వారి స్థితి, బలములు, సానుకూలతలు | | | |
| 7 | | వర్తమాన మహాదశ, అంతర్దశ, ప్రత్యన్తర్దశా నాధుల స్థితి, శుభత్వము | | | |
| 8 | | గోచార రీత్యా విశ్లేషణావిషయ సంబంధిత గ్రహముల అనుకూల ప్రతికూల స్థితి | | | |

## సోదాహరణ జాతక విశ్లేషణ : రాశి > సప్తమాంశ వర్గ చక్రము:

తరచూ గర్భ స్రావము జరుగుతూ సంతానం కాక పోవడం గురించి జాతక పరిశీలన - పరిహారములు

| | | | |
|---|---|---|---|
| కుజ | | రవి బుధ శుక్ర | |
| గురు | జన్మ కుండలి 15-05-1962 11:40 | | రాహు లగ్నం |
| శని కేతు | | | |
| | | | చంద్ర |

| | | | |
|---|---|---|---|
| | చంద్ర | | శని కేతు |
| లగ్నం గురు కుజ | నవాంశ కుండలి | | బుధ |
| రవి | | | |
| రాహు | | | శుక్ర |

విశ్లేషణ: జన్మ కుండలి - లగ్నం కర్కాటకం లో రాహు; 6HL గురువు; 7, 8 HL శని, యుతి చెందిన కేతువు ప్రతికూలంగా వున్నారు. సంతాన కారకుడు గురువు అష్టమ/ పాప కర్తరీ స్థితి, కుజ శుక్రులు వృద్ధావస్థ లో బల హీనులు, బుధ శుక్రుల స్థితి బలంగా వున్నది. రవి 2HL పుత్ర దాత కానీ “బాల్యావస్థ” లో వున్నాడు.

నవాంశ – రాశి లగ్నము తో 6/8 అక్షము, కుజ స్థితి 2/12, 5 లో శని కేతు-రాహు ల అక్షము లో, లగ్నాధిపతి 3 లో (8>8), రవి 12 లో, బుధ 6 లో స్థితి

## సోదాహరణ జాతక విశ్లేషణ : రాశి>సప్తమాంశ వర్గ చక్రము:

| | | | |
|---|---|---|---|
| కుజ | బుధ | చంద్ర రాహు<br>గురు శుక్ర | లగ్నం |
| | సప్తమాంశ కుండలి | | |
| | | | |
| | రవి శని<br>కేతు | | |

**విశ్లేషణ: సప్తమాంశ కుండలి -** వర్గ చక్ర లగ్నము పై కుజ దృష్టి, ‘రాశి’ ‘వర్గ’ ముల లగ్నములు 2/12 అక్షము లో, చంద్రుడు మూల త్రికోణ రాశి స్థితి. కానీ వర్గ చక్ర లగ్నానికి 12 లో రాహు, సంతాన కారకుడు గురు, శుక్రులతో యుతి చెంది, శని రవి కేతువు ల పూర్ణ దృష్టి లో.

**గురువు, శని, రాహు, కేతువు ల శాంతి కై పరిహారములు సూచించగా అవి పాటించిన తరువాత రాహు మహా దశ - బుధ అంతర్దశ లో జాతకురాలికి పుత్రోదయం అయినది.**

(*Source*: “How to study Divisional Charts” – Prof. V K Choudhry)

## సోదాహరణ జాతక విశ్లేషణ : రాశి>నవాంశ వర్గ చక్రము:

### వైవాహిక జీవితం సంబంధించి

| | | | |
|---|---|---|---|
| | రవి | బుధ<br>కేతు | శుక్ర |
| చంద్ర | రాశి చక్రం | | గురు |
| కుజ<br>లగ్నం | | | |
| | శని<br>రాహు | | |

| | | | |
|---|---|---|---|
| గురు | చంద్ర<br>బుధ | కేతు | కుజ |
| | నవాంశ కుండలి | | లగ్నం |
| | | | |
| | రాహు<br>శుక్ర | రవి | శని |

విశ్లేషణ: రాశి చక్రములో 3 గ్రహములు (రవి, కుజ, గురు) ఉచ్ఛ రాశి స్థితి. లగ్నం – మకరం, రవి(8L) గురు (12L, 3L)లు అశుభులు. సప్తమాధిపతి చంద్రుడు ద్వితీయ స్థితి. గురువు సప్తమ స్థితి. కళత్ర కారకుడు షష్ఠమ స్థితి. లగ్నాధిపతి శని రాహు యుతి తో ఏకాదశ స్థాన స్థితి. కుజుడు లగ్నము లో వుండి గురువు తో పరస్పర దృష్టి మరియు రవి పై దృష్టి. శని దృష్టి కుజుడి పై వున్నది.
నవాంశ చక్రము లో లగ్నేషుడు తృతీయములో (రాశి లో 9), వర్గేషుడు (రాశి లో కళత్ర భావాదిపతి) దశమము లో బుధుడి తో (12L), లగ్నానికి శుభుడైన కుజుడి మూల త్రికోణం లో చంద్రుడు, నీచ పడిన రవి దృష్టి లో. కళత్ర కారకుడు – ఖర నవాంశ (తుల) రాశ్యాధిపతి కూడా.

శని>రాహు దశా కాలములో అత్తా మామ ల చే హింసించ పడి భర్త తో విడాకులు తీసుకున్నారు

(*Source*: “How to study Divisional Charts” – Prof. V K Choudhry)

## సోదాహరణ జాతక విశ్లేషణ : రాశి>దశాంశ వర్గ చక్రము:

లగ్నం 08-23:52 రవి 05-10:08 చంద్ర 03-19:24
కుజ 03-10:26 బుధ 05-07:41 గురు 04-17:00
శుక్ర 03-25:08 శని 09-05:13 రాహు 10-23:06

| | | | |
|---|---|---|---|
| | | | |
| రాహు | రాశి కుండలి | | చంద్ర కుజ శుక్ర |
| శని | | | కేతు గురు |
| లగ్నం | | | బుధ రవి |

| | | | |
|---|---|---|---|
| బుధ | రవి శని రాహు | | |
| శుక్ర | నవాంశ కుండలి | | |
| | | | |
| చంద్ర | లగ్నం | కుజ కేతు | గురు |

| | | | |
|---|---|---|---|
| కేతు | | | కుజ |
| | దశాంశ కుండలి | | లగ్నం బుధ |
| | | | రవి |
| గురు | శుక్ర | శని | చంద్ర రాహు |



నుండి

## సోదాహరణ జాతక విశ్లేషణ : రాశి>దశాంశ వర్గ చక్రము:

**లగ్న కుండలి:**

1. ధనుర్లగ్నం – లగ్నాధిపతి గురువు భాగ్య స్థానములో లగ్నము పై దృష్టి తో స్థితి
2. 9, 10 ల అధిపతులు, రవి బుధులు 10 లో స్థితి. బుధుడు ఉచ్ఛ స్థితి
3. పంచమాధిపతి కుజుడు 6, 11 ల అధిపతి శుక్రునితో కలిసి 8 లో చంద్రుడితో (HL) యుతి, అందరిపై శని స్వక్షేత్రము నుండి (2H) పూర్ణ దృష్టి.
4. 1, 3, 5 ల పై గురు దృష్టి

**నవాంశ కుండలి**

1.వృశ్చిక లగ్నం, కుజుడు కేతువు తో 12 లో యుతి స్థితి
2.ద్వితీయ పంచమాధిపతి గురువు 11 లో స్థితి
3.భాగ్యాధిపతి, చంద్రుడు ద్వితీయములో గురు క్షేత్రములో స్థితి
4.దశమాధిపతి రవి, 6 లో ఉచ్ఛ స్థితి, శని (నీచ), రాహువుల తో యుతి, కుజుడి దృష్టిలో 8, 11 ల అధిపతి, బుధుడు నీచ పొందినాడు

**దశాంశ కుండలి**

1.లగ్నం కర్కాటకం లో 3, 12 ల అధిపతి, బుధుడు దిక్బలము తో గురు శనుల దృష్టి లో స్థితి
2.6 అధిపతి (ఉద్యోగ కారకుడు) గురువు, శని దృష్టి లో స్వక్షేత్ర (రాశి లగ్న రాశి) స్థితి
3.10 అధిపతి కుజుడు 12 లో భాగ్యాధిపతి గురువు పూర్ణ దృష్టి లో
4.అష్టమాధిపతి శని ఉచ్ఛ స్థితి

జాతకుడు, వృత్తి పై నిబద్ధత తో ఆర్థిక శాఖ లో అనేక ఉన్నతోద్యోగములు, రిజర్వు బ్యాంకు గవర్నర్ గా, ప్రణాళికా సంఘం అధ్యక్షుడు గా , కేంద్ర ఆర్థిక శాఖ మంత్రిగా, చివరగా దేశ ప్రధాన మంత్రి గా అత్యున్నత పదవులు పొందినారు. (డా.మన్మోహన్ సింగ్)

# ఉపసంహారము

జ్యోతిశ్శాస్త్రములోని హోరాస్కంధము జాతక విశ్లేషణ కు మూలాధారము. ఈ స్కంధము హోరా శాస్త్రముగా ప్రసిద్ధి చెందినది.

"జ్యోతిశ్శాస్త్రము ఒక మహా సముద్రము వంటిది, దీనిని దాటుటకు (అర్ధం చేసుకొని ప్రయోజనం పొందుటకు) ఒక నావ వలె తోడ్పడునట్టుగా "బృహజ్జాతకము" అను గ్రంధమును రచించుటకు ఉపక్రమిస్తున్నాను"

అని ఆధునికులకు జ్యోతిష శాస్త్ర విజ్ఞాన సర్వస్వం అందించిన మహనీయుడు, వరాహ మిహిరుడు, స్వయంగా, వినమ్రముగా, ఈ శాస్త్రము యొక్క అనంత స్వరూపమును, దాని పై మానవులకు అందుబాటులో వున్న జ్ఞాన పరిధి ని ఉదాహరించినాడు.

ఈ నేపధ్యములో, నేటి కాలములో మానవులకున్న జ్యోతిష శాస్త్ర జ్ఞాన స్థాయిని మనం ఊహించ వచ్చును. నిరంతర సాధన ద్వారా ఈ శాస్త్ర జ్ఞాన ప్రకాశమును కాలక్రమములో అధికాధికముగా పొందుటకు ఉపాసన చేద్దాము.

జ్యోతిశ్చక్రేతు లోకస్య సర్వస్యోక్తం శుభాశుభమ్ !
జ్యోతిర్ జ్ఞానంతు యో వేదం సయాతి పరమాంగతిం!!

జ్యోతిశ్చక్రం లోకంలోని అందరికీ శుభాశుభాలను తెలియజేస్తుంది. జ్యోతిష జ్ఞానం కలిగిన వారు పరమమైన గతిని పొందుతారు.

## వర్గ చక్రాల గురించి, తెలుగులో అందుబాటులో వున్న గ్రంధములు




స్వస్తి 